# పీఠిక

కవి కృతి

శ్రీ సోమంచి సూర్యనారాయణశర్మ గారు 'స్వర్ణకుమారి' యను నీఖండకావ్యమును రచించిరి ఇది (The Golden touch written by Nathanial Hawthorne) 'దిగోల్డెన్‌టచ్' యను నాంగ్లకథకు ననుకృతి. మూలము వచనము; కథారూపమున నెథానియల్ హేథారన్ యను నాతఁడు రచించెను. 'స్వర్ణకుమారి' యనువాదమయ్యు స్వేచ్ఛానువాదము. మూలమునందలి వస్తువును గైకొని, యనువాదకర్త దేశకాల పాత్రముల ననుసరించి యలఁతి మార్పులఁ గావించి, కలమును విశృంఖలముగ నడపెను.

కవి కావ్యము

శయ్యయే మానవుఁడని సర్ వాల్టెర్ రాలీ వచించెను. మనము దీని నలఁతి మార్పుతో శయ్యయే కవి యని వచింపఁ జెల్లును; ఇంక నొకింత దూరము పోయి కావ్యమే కవి యాకృతియని స్థూలముగఁ బ్రతిబింబించు దర్పణమనియుఁ జెప్ప నొప్పును. ఏలనఁ గావ్యమునందు సమకాలికులకుఁ గవి యాకృతియుఁ గవి యభిరుచులును, గవి స్వభావాదులును జాల వట్టు గన్పట్టును. శ్రీసూర్యనారాయణ గారు పండిత బ్రాహ్మణ వంశమున జన్మించిరి; సంస్కృతాంధ్రాంగ్లములఁ బఠించిరి; అస

హాసోద్యమమున దుమికిరి; కారాగారక్లేశాదులను కాలకాలమనుభవించిరి; ఆరోగ్యభాగ్యాదులను 'అహింసాపూర్వక విప్లవాత్మక జాతీయోద్యమ'మునకే వదలి నేఁడొకవిధమైన విశ్రాంతిని గైకొనుచున్నారు. ఇట్టితఱి వీరు తాము పూర్వమెన్నఁడో రచించిన 'స్వర్ణకుమారి' 'మేఘదూతానువాదము' మొదలగు గ్రంథముల నచ్చొత్తింపఁ బూనుకొనుట శ్లాఘాపాత్రము.

ప్రగతి కవులయ్యు వీరు పద్యమునకు గణ యతి రచనా వైఖరి ప్రాసాదులుండుట కవితామతల్లికి సంకెలలువైచుచే యను నభిప్రాయము గలవారుకారు; అట్లని యతిప్రాసాది నిబద్ధమై యుండితీరవలెనను నావేశము కలవారును గారు. ఇందుల కుదాహరణములు పాఠకుల కీగ్రంథమున నందందుఁ గానవచ్చును. అరసున్నలు బండిరాలు మొదలగు వానిని గణుఁడుకట్టిన పండితలోకమునకే వదలి శ్రుతిపేయతను మాత్రము వీరు గైకొనిరి. దేశకాలానుసరణమును, పాత్రోచితమును, బదార్థానుగుణమునైన వీరి శయ్య వివిధరీతులతో శబ్దార్థాలంకారసమన్వితమై విలసిల్లుచున్నది. ప్రాఁత పంథా నటనట వీడిన వీరి రచన యిక్షురసమునందలి మిరియపుఁబొడివలె వట్టుఁదనము గల్గి సహృదయహృదయాహ్లాద సంధాయినియై వెలయునని విశ్వసించుచున్నాను.

వీరి యితరకృతులకుఁ గూడ నినాలోకనసౌభాగ్యము త్వరలోనే సంతరించునుగాఁత.

చక్రవర్తుల వేంకటఅప్పలాచార్యులు.

# ఒక మాట :

1934 సంవత్సరము నాటికే యీ చిరుకబ్బము (అనువాదము) వ్రాసినాను. నా పెద్దకుమారునికి అప్పటికి బాల్యక్రీడా గోష్ఠి నున్నవానికి వినిపించినాను. నాడు నేను చూపిన యిద్దఱు ముగ్గురు కొద్దిమందిలో నాతడొకడు. వెంటనే ప్రచురించవలసినదని నన్ను హెచ్చరించినాడు. ముందీ పుస్తకమే ప్రకటింపుమనువాడు. మరణ శయ్యనుండి కూడ 1954 లోను దానిని తలపెట్టుచునే యుండెను.

విధి విపాకము నేటికీపుస్తకమును బైటికి తెచ్చినది. నా ప్రకాశ జీవితకాలములో ప్రచురింపజాలనైతినిగదా యను విచారముతో నిన్నికన్నీళ్లతో ఆతని స్మృతికే దీని నంకితము చేయుచున్నాను. ఇందుగల గుణములు మూలగ్రంథకర్తవిగను, తదితరములు నావిగను పాఠకులెంచికొన ప్రార్థింతును.

అవ్యాజమగు దయతో అచిరకాలములో పీఠిక వ్రాసి యిచ్చిన శ్రీమాన్ అప్పలాచార్యుల వారికి గృతజ్ఞుడను.

సోమంచి సూర్యనారాయణశర్మ.

౧

అతఁడు నరలోకయక్షేశుఁ డనిన గాని,
లేదు వాతప్పు, సంపదాశీలసితుఁడు
తొల్లి విలసిల్లు నొకఁడు, తేఁడు నయి కూడ,
జనము శ్రీదాసుఁడని యాడికొనఁగ దన్నె.

ఒక్క ముద్దుబిడ్డ యొప్పారు, నొప్పుల
కుప్ప యతని యనుఁగుగూఁతురగుచు;
లోకమెఱుఁగ దా యలోకసామాన్యక
న్యా మనోజ్ఞనామ మేమొ కాని.

ఒకపరి విన్నటులను జ్ఞా
పకమున్నది కాని; నేఁడు వచియింపఁగతే
నకటా! వినలేదో, ఆ
ముకురాస్య శుభాఖ్య నాదుస్మృతి బాసినదో?

కాని మైమ్రనది యేదో
కానిచ్చెద నేనె నామకరణ మిమ్మపుడే
మానక "స్వర్ణకుమారి" మ
హానందము నాకు, బేరు లమరించు టనన్

విశ్వమందు తాను విన్నట్టి కన్నట్టి
యెల్ల వస్తులందు నుల్లమిచ్చి
యుల్లసిల్లు బైడి యొక్కటి గన్ననే
అందె కాంక్ష నిరత మవనిపతికి.

రాజమకుట మంత మోజుతో నాతడు
తలనుదాల్చు నొక్కవిలువ వలనె ;
నిక్కపునుడి సుండి, అక్కిరీటము దండి
కాంతులీనునది జగాపసిండి !

కాంచనము మించి గానీ
యించుక తక్కువగ గాని యేవేళను బ్రే
మించు గుమారికనే ; స్వ
ర్ణాంచిత లోలుండు తన్నరాధ్యక్షుడటన్

తనదు చిన్నిచేతులను వాని మెడచుట్టు
బెనయజేసి యాడు నసుగుబిడ్డ
ముద్దుమోము గాంచి ముద్దాడు నాతడు
హద్దులేనిరీతి నప్పుడపుడు

ఆమె ప్రేమించుకొొలది నుద్దామమగుచు
నత్తుకొనె హేమతృష్ణ తచ్చిత్తమందు ;
అనుగుదనయ కపూర్వకాంచనపు రాసి
దఖలుపరచగ నాతడుత్కంఠ గాంచె

గారాపుగుమారిత కొక
మేరువునంతటి పసిడి యమేయవిధిని, సే
కూరిచి యిచ్చుటయె మహో
దారవిధిగ నెంచు, దా సదా తేడపురా !

ఆ తలపు లంతకంతకు నగ్గలమయి
స్వర్ణసంచయదీక్షను బట్టె నాత ;
డిలను, బంగరుగాని వస్తు లెవి గాని
యంట కంటనుగన వాడు కంటగించె

ఒడయు మేడ పునాది యట్టడుగునందు
కటికిచీకటిగదిలోనె, గడపు ప్రొద్దు
చాలగా ; నయ్యె నిదొక మామూలు ; వాని
ఘననిధానము లెసగు నక్కడనె కడిది.

ఆ యేకాంతబిలంబున
హాయింగోరినపుడెల్ల, నటు దూరు నృపుం
డీ యిల లోభులకు, సదా,
యే యెడ సేవ్యంబు హేమమే యగును గదా !

గదినిదూరి, తల్పు పదిలముగ బిగించి
కొని,తనర్చు తాళమును లగించి,
కనకపాత్రమొ, మరి కాసులబస్తాయొ,
తడవికొనుచు పొంగిపడును తడవు

మూల దిడ్డికన్నమునసుండి జాలారు
నొక్క తరణికిరణ మక్కజంబు ;
కానలే డతనికడాని, వెల్గది లేక
కాన నొల్లె కిరణకాంతి జేడు

ఒక్కటి, రెండు, మూడనుచు,
        నూరక కాసుల లెక్కపెట్టుచున్,
చిక్కని మేల్మికమ్మి గొని,
        చేతులపై కెగిరించి పట్టుచున్,
మిక్కిలి యక్కడానిపొడి,
        మీటుచు వేళుల గేలి ముట్టుచున్,
పెక్కువితాల, గోతి దల
        పించును వెక్కురుభూపు డద్దిరా!

పైడిగిన్నె చేతబట్టి, యొక్కెడ, తన
మోమునీడ గంచు మురిసిపోవు;
"నీదె, హాయి యన్న, శ్రీదాసమహిపతీ!"
అనుచు నేమొ గొణిగికొను నతండు.

హాస్యజనక మయ్యె, తదీ
యాస్యప్రతిబింబ మప్పు డరయుకొలది, న
ప్రాశ్యం డాతండని యప
హాస్యంబొనరించుచుండె ననదగె నాహా!

తాను సుఖినని, మనమున దలచుగాని,
చాలిన సుఖంబు లేదని డీలుసెందు;
లోకధన మెల్ల తన కాశీలోన, జేరి,
తళుకుబంగరురాశిగా దలచు నతడు.



## ౨

ఒకనా డానృపు డెప్పటట్టుల వినో
దోద్యోగమందుండ, బా
యక యక్కాంచనరాశి గాంచి యొకచా
యన్ తద్ధనాగారమం
ద, కడున్ నివ్వెర దత్క్షణంబ శిరమె
త్తన్ దర్శనంబిచ్చె, హా!
అకలంకాల్పమరీచి నొక్క యువది
వ్యవ్యక్తి దివ్యద్గతిన్.

తాళముబిగించికొంటి భద్రగతి; నెన్ని
సారులో, లాగిచూచితి; దారిలేదు;
వేలుపులకేని గాదు ప్రవేశ; మితడు
దేవతాతీతు డెవ్వడో కేవలంబు.

అనుకొనుచునుండె సంభ్రాంతుడగు నృపాలు
డా పసిడి యెల్ల దన మందహాసకాంతి
ధగధగద్ధగలాడ, శ్రీదాసు దెసకు
మఱలి వచియించె నిటులా యమర్త్యమూర్తి :-

"మిత్ర, శ్రీదాసరాజ, మేల్మేలు! మహిత
సంపదాత్ముడవీవు నిస్సంశయంబు;
పుడమి నే నాల్గుగోడల నడుమగాని
కాంచలేనందు నింతటి కాంచనంబు."

"ఏదొ, యావచ్ఛ్రమార్జిత మిది, యలుపము ;
బ్రతుక దెల్లను బట్టె నీమాత్రమునకె
అధమ మొక వేయియేండ్లాయు వబ్బవలయు
భాగ్యవంతుడు గావచ్చు యోగ్యతకును"

"తృప్తినిం గనవైతివే యింక నీవు"
తల గదల్చె నరేంద్రుడా తత్క్షణంబ;
"నీకు సంతృప్తికర మవనీస్థలి నెదొ,
సుంత వచియింపు మే సంతసింతు నెంతొ"

అనె నవవ్యక్తి మన తేడు వెనుక తగ్గి
అట్టె ధ్యానించె, నేమొ రవ్వంత సేపు:
తళుకుమని తట్టె నొక్క యుజ్జ్వలపుటూహ,
అతని ప్రియహేమకాంతిచ్ఛటాదృశమ్ము.

వెంటనే, మౌళినెత్తియుద్వీక్షణంబొ
నర్చె భాస్వన్నవాకృతి నరవరుండు;
నీదుకామిత మేదొ, నిర్ణీతమయ్యె
ననుచు దోచెడి, బల్కవే? యనె నమరుడు.

అర్థసంచయమున నల్లాడి, యల్లాడి,
అలసి, సొలసి, కంటి నలుపములనె;
పట్టినట్టి దెల్ల బంగరుగా నెంతు,
నదె, మదీయవాంఛ యనియె తేడు.

అపుడు దివ్య మందహాసరోచులు గ్రమ్మ,
కాంచనపటువస్తు సంచయమున,
రాలునాకుల శిశిరాన గుబ్బలిలోయ
చాయ, నికనరాప్తి చాయ నాయె.

"అంటునది కడానియో కోర్కి ! మేల్ రాజ
మంచి యూహ తట్టె మదికి నీకు !
నీవ యర్హుడగుదు వా వరానకు; సరే,
నీదు తృప్తి దీన నిక్కువమ్మె ?"

"ఏల కాకుండు ?" "శ్రీదాస, యెన్నడేని,
చింతిలవుగద ?" "యెక్కడి చింత నాకు ?
పరమ సౌఖ్యాత్మజేయ నవ్వరమె చాలు"
"ఎల్లిప్రొద్దుటినుండి సిద్ధించుగాత !"

వరదానమొసగి దివ్యుడు
కరము మృదూక్తులను, సెలవుగై కొను వీకన్
కరమూపి, యదృశ్యతగనె;
నరపతి గణియించె నిక క్షణమ్ము యుగమటుల్.

# 3

అది ప్రభాతవేళ, అంచతూలికపాన్పు
నందున దొర నిదుర జెంది యుండె;
జాలరంధ్రములను మేలిమి కిరణాలి
నోలి బంపుచుండె బాలతరణి.

కరము మెఱయించె, తొలి రవి
కరమె, తదీయమృదుశయ్యా కలితాంబరమున్;
పరికింప నది జగాబం
గరునేతయె యయ్యె! ఱేడు కడు నబ్రపడన్.

అపుడె, లేచి నృపతి యానందపుంబిచ్చి,
గనినదెల్ల నంటికొనుచు గేల,
గలయదిరిగివేసె, గదులు, వరాండాలు,
హాలు, రకరకాల యంతరాలు.

మంచపు గోళ్లను మఱి పందిరియు నంటె
నవి సువర్ణమయమ్ములై వెలింగె !
కిటికీతెరను లాగె, తటుకున గొని, చేతు
లార; జెలంగె బంగారు ప్రోగు !
బిరబిర దుస్తుల ధరియించికొనియె; హే
మాకృతి గాంచి, ముదబ్ధి మునిగె !
తనదు చేబెత్తము గొనియె; వెన్వెంటనె,
అది మేల్కడానియై యందమందె !

వాని ముద్దుబిడ్డ స్వర్ణకుమారి ప్రే
మాతిశయవిలీల నల్లి యిడిన
చేరుమాలు దీసె ; చారుతరంబయి,
మేల్మిలతల నద్ది మెఱసి పోయె !

ఆ క్రియ దివ్యగేయరమ యట్టె తనంతన వ్రాలు నాదు ద
ర్జాకిది యెంతమాత్రమును చాలదటంచు నృపుడు సౌధమున్
ప్రాకటరీతి మెట్లు డిగిరా, గరమూనిన దారుభిత్తి, ఆ
హా ! కమనీయ కాంచనమ యయ్యె, నతండు మహాద్భుతం
పడన్.

అందున, గనుపించె పూలు
పొందు, బసందగు గులాబిపువ్వుదోట యొకం
డెందము గుప్పెనగ, ననల్
వందడిపై రేగ, తుమ్మెదలు జుమ్మనుచున్.

సుప్రభాతవాతసుంభితంబై తదా
రామ మపు డనస్వరమ్యమయ్యె,
అల గులాబితావి, హాయంద మాతీవి,
హా విస్రమరుచి గలావె యెందు ?

తోటగేటు నొక్కి త్రోపున దొలగించి,
మాటె, లోనికి, పసి దొర బిరాన;
అస లయోమయమ్ము లక్కవాటమ్ములు
చొక్కపు బయిడయి, తళుక్కుమనియె !

ఆ సుమరాజి నంటకు ననర్ఘ మొనర్ప గుతూహలించి.
దానమహీధవుండు కరతామరసమ్మున నంటితీరె, చే
రాస, గులాబిచెల్ల; విసుగన్నది లేకయె తుప్పతుప్పుగో
పీసరనోవనీయ కరవిచ్చిన మొగ్గయు లోని కీటకమున్.

బంగారై, కుసుమాదులు
రంగారినవేళ, బిల్బ్రురా, గాఫికిన్
చెంగునజనె భవనమున కె
సంగన్ క్షుధ ఉదయవాయుసంగతి దఱచై

అంతటి భూమిపాలునకు నా దివసాన ప్రభాతభోజనం
బెంతటిదై విరాజిలె, నొకింత యథార్థ మెఱుంగ, నట్టి వృ
త్తాంతవిచారణమ్మున కథాగమనమ్మును మాన; నీవె యూ,
హింతువయేని యో చదువరీ! ప్రతిసెప్పగ బూన నందుకున్.

ఐన నట్టి ముదాస్పదమౌ దినాన,
గొన్ని పూరీలు బన్నులు, చిన్ని చేప,
లిన్ని గ్రుడ్లు ర్లగడ్డలు, నింతకాఫి
అతని ప్రొద్దుటివిందగు నందు నేను.

పాలున్ రొట్టెయు జాలున్
బాలికకెయ్యెడ; నృపాలభక్ష్యవిధి యిదా
యేలిక గొనియెనొ, లేదో,
మేలింతకు మించి వాడు మెసవడు సుమ్మీ

౪

అమలగుణసముపేత, తదాత్మజాత
చేరరాదయ్యె స్వర్ణకుమారి తేని;
తెల్లమొగమయి కూర్చుండె టేబిలు కడ,
నతడు తనయాగమన నిరీక్షామహితుడు.

అనుగుబిడ్డకోస, మయిదారు కబురులం
పించె, దొర, రివాజు మించి, నాడు;
అతని వత్సలత్వ మాప్రొద్దుట తదీయ
భాగ్యసిద్ధి కతన బహుళమయ్యె.

కనుల గుడ్డ గప్పికొని, యుత్కటనిరాశ
వెక్కివెక్కి యేడ్చు చక్కమారి
యెట్టయెదుట వ్రాలె, నెట్టి, కవాటమ్ము
నట్టె; కూతు, హేతువడిగె నృపుడు.

అంబరాంతరమున, మాటి, పక్షియుగళ
మొక్క కేలను, వాల కొంకొక్క కేల,
పసిడివన్నె గులాబి మేల్పసిడిపూవు,
పరిమళవిహీనము, విషాదపరత జూపె.

ఇంత సుందరరుచి నెసగె పైడిగులాబి
చింత నడల నేల చిట్టితల్లి!
అనుచు బృచ్ఛసేసె పరమేశ్వరుడు మహో
వికృత మనియె దనయ వెక్కి వెక్కి.

ముస్తాబై, పువుదోటను,
నిస్తులగతి బోతి; ననలు నే గోసినవే
శస్త్రములా, నీకని, యీ
అస్తవ్యస్తమ్ము నేమనందును తండ్రీ!

అరుణమోహనమ్మై వింతకాంతుల
మురువుగొల్పు చెంతో పరిమళించు
కుసుమవిసరమెల్ల పసటూలి, పసిమాలి
పాలిపోయె, తావి బాసిపోయె.

ఆలో సుమసముదయముల
వేలాగు పరీక్షసేయనీ, నాన్న ! యిదే
వాలక మిత వర్ణింపగ
నేలా ? దుఃఖకర మిట్టి హీనావస్థన్.

అనుగుపనయ 'సెబ్బె' యనుచు శ్రీదాసుడో
దార్చు నంతె, యెదముదమ్ము గదుర;
నందనకును గుండు నందించు తనచేత
సెప్పుకొనగ సిగ్గు జెందె నతడు.

"కూరుచుండి విందు గుడువు; శతాబ్దము
లలరు నిట్టి మేల్మి యలరుతోడ
క్షణములోన వాడు సామాన్యపుగులాబి
పూలు వేలవి యవలీల రావె ?"

"ఏకొాలది లేదు వాసన,
రేకులు గ్రుచ్చుకొాను శ్రీహరీ ! నాస, నిసీ !
నాకేల, యిట్టి పూ"వని
చేకొాలదియు విసరె బాల శీఘ్రమె నేలన్

బాలిక కూరుచుండె బితపజ్జ; నతండొక పానపాత్ర కా
ఫీ, లలితా న్యపాత్రమున బెల్చన బోసె, విలాసమొప్ప; దా
గేలను బట్టినట్టి యల గిండియ మేలిపసిండి యయ్యొ; మున్,
బోల, నదెట్టిలోహమొ, ప్రపూజ్యము నేడిటు పాతకాగ్రణీ!

ఉదయభోజనమునకో యింత లింతలు
వింత పైడిగిండ్ల వేడబంబు!
ఎంతమాత్ర దగదిసీ! నన్ను బోల్, నిరా
డంబరప్రభున, కడావడీ యిది.

దుర్వ్యయంబయారె! దూబరి పోకడ!
ప్రకటకనకమఖిల పాత్రసమితి!
పాకశాల. బీరువా, నిది పదిలింప,
జాలకష్ట మది యసంభవంబు!

అని వింత చింతలందుచు,
దన పెదవుల నొచమింప, దగ చెంచా కో
షి, నృపాలుడంటి వెంటనె,
కనీయెన్ గరగినకడావి కడు విస్మితుడై

కరడుగట్టై, నద్ది, మరుసటి నిముసాన;
దయ్యా మంటినటు, కటా యని, దొర
చిన్నిచేప నంటె, జిటికెనవ్రేల; హా !
పైడిమీనమయ్యె పక్వరుషము !

కురిచీలో, విరుచుకపడి,
యరచెన్ నరపాలు డెంతయయ్యొ నహా ! దు
ర్భరదారుణమని, కరముల
శిరమిట్టే బట్టుకొనుచు, జింతాకులుడై

చేరి, చిన్నారిస్వర్ణకుమారి, కూరి,
వే నమలి, కమ్మపూరి, కాఫీని గ్రోలె;
అంతటి యనర్ఘ భక్ష్యము లకెదుట !
కొఱుకరాదొండు సొకని, కుమిలె, నృపుడు.

బాలిక కుడుపుం గనీ, తన
సొలుక నీరూర, విన్ననౌ నప్పటి భూ
పాలకు వాలక, మెంతటి
జాలికరంబో, లిఖింపజాల, చదువరీ !

మహీపశేఖరార్హమహితరమాస్పదం
బహూహా; యందెసంగునట్టి విందు !
వేయి యేమిటికి ? తదీయోరుమూల్యమే,
యాయె, గతము తన్నిరర్థకతకు.

కటికిపేదకాపు గంజినీళ్ళాని, య
వేలహర్షవార్ధి నోలలాడు;
ఎత్తుకెత్తు పసిడియే తిండి నిండారు
పాలకాగ్రసరు నవస్థ చూడు !

కన్నారే ? విన్నారే ?
మున్నెవరే, పాతకోత్తములు మీరిలపై
నున్నతసంపన్నాంధుం
డిన్నరపతి తెన్ను దీనహీనదశనిసీ !

పెద్ద, కళవళించె, పొద్దుటిబుత్తికే,
ఱేని నకనక వివరింపనేల ?
రెండుపూట లింక నొండు తెఱంగౌనె ?
కుడుపుగనునె, వాని కడుపెదేని ?

ఎన్ని దివసము, లిట్టి సంపన్నభుక్తి,
మన్ను, నమ్మన్నుదొర ? చింత, మఱగిపోయె;
అఖిలవస్త్వాదికామ్యంబొ, అవని, సర్వ
కామ్యసామాన్యమో కనకమ్మటంచు.



౫

ఒక్కట క్షుధానలజ్వాల నుడికి, యుడికి,
అక్కటా ! నృపు డుక్కిరిబిక్కిరయ్యెః
దిక్కుమాలిన తన దుర్గతికి, గడింది,
పొక్కెబో, యాతడు, లబోలబోమని వడి.

అరయంజాలక, కన్నతండ్రి పడు దుఃఖావస్థ హేతుజ్ఞయై,
పరికించెన్ క్షణమాత్ర,వాల్పకయె తెప్పల్ బాల,చింతామనో
హరలీలామతి, తద్వ్యథానునయగాఢాసక్తిమై, యొక్కచే
పరుగై వాలె; నృపాలు జానుయుగమున్ బాహుద్వయిం
జుట్టుచున్.

ఓ నా స్వర్ణకుమారీ !
నానోములపంట ! యనుచు, నమ్రాస్యుడు, భూ
జాని యనుంగు కుమారి, న
హీనప్రియ, నాముహూర్తమే ముద్దిడియెన్.

భూరిస్పర్శ నృపాలుడ
పారమ్మగ గన్న నాటి భాగ్యముకన్నన్
భూరిగతి నెంచె నతడె
న్నారెట్లా వేళ, దన తనూజప్రేమన్.

అరచందురుని దొరవై, నెమ్మెజిమ్మెడి
నెమ్మోము, వసువికారమ్మగాంచె!
బెడగారు లేగులాబీ వన్నె చెక్కిళ్ళ,
నచ్చపచ్చనిగచ్చు లచ్చుపడియె!
తెలిముత్తెములన, బుగ్గలజిందు, నశ్రు బిం
దులు, పై డిగుండుల్లై, నిలిచె, నట్టె!
మృదుమదాలివినీలమోహనకుటిలాల
కాలి, యదే వాలకమున దేలె!

మధురమంజుల మా సుకుమారమూర్తి
కర్కశమ్మయిపోయె, తత్క్షణమె, జనక
బాహులతికాంతరమున, ప్రేమప్రపూర్ణ
ముగ్ధమువ్వాని దొక సుముద్దుతోసె.

ఎన్ని పిలిచిన దా బల్కునేల ? యిప్పు
డామె స్వర్ణకుమారియే అక్షరాల !
ఎంత ఘోరాతిఘోర ! మ దెంత క్రూర,
మెంత ప్రాణాంతకము ! నృపు డెనసె వరము.

అనుగు జిన్నారిపొన్నారి తనయ నేడు
తన దురాశామహాభూతమునకు బలిగ
నర్పణంబొనరించినా డపుర ! తేదు;
ముద్దెపో ! మృత్యువాయెను ! ముద్దుసుతకు.

లేవు చిరునవ్వువెన్నెలల్; లేబెదవుల
నరుణరోచులు లేవు; లే దక్షిచాల
నమ్మ; నింకేల నమ్మ, శూన్యమ్మ బాల;
కఠిననిర్జీవకనకవిగ్రహమె కాని.

నెత్తిని నోరుగొట్టుకొను;
నేలపయింబడి దొర్లు; మీసలున్,
జుత్తు దెమల్చికో గను ; ను
సూరను ; నుల్చుకొనుం గరాంగుళల్,

మొత్తుక గుండె లేడ్చు నటు,
బోరననశ్రులు, సారె, సారె, భూ
భృత్తిలకుండు నైజపరి
పూర్ణమనోరథసిద్ధుడౌ తఱిన్
కనియు సహింపలేడు మఱి
కానకయున్ సహియింపనోప, డౌ
య్యాన, నిమిషమ్ము బొమ్మపయి
నక్షియుగమ్ము నిగిడ్చి కాని,నె
మ్మనమున నమ్మజాలడు కు
మారిక ఘోరవికార మౌర! తా
ననితరఘోరదుఃఖతమ
సాంధనృపాలుడు మాటిమాటికిన్.

అతని కళవళమ్ము, నళుకు, నాందోళన,
మతనిదైన చీకు, నా చికాకు,
అతని యారటమ్ము, హైరాను, గాబరా
యెఱిగి, యెవని కడుపు చెఱువు గాదు?

ఒక్కచూపునగనె భూపు, ముజ్జ్వలవను
విగ్రహమున, హారిద్రాభవిలసితము లు
చెక్కుట దలిర్చు కన్నీటిచుక్క యొకటి,
జాలిగ్రక్కు విలోకనలీల యొకటి.

ఆ భావప్రకటనమున
కే ఖౌర్యాకృతి యదెల్ల మృదుమాంసలమై
శోభం గనవచ్చెనో, లే
దా భాగ్యము, నేడు, మన మహోధనికి నహో!

అస్మదీయమహోధన మఖిల మొకట,
ధారవోసియునేని, గుమారి ముద్దు
నగుమొగము, బల్కునుడు గాంచనగును నేని,
సర్వభూన్యుడ నౌడు, విశ్వమున, నంచు
పిసిగికొన్నాడు చేతు, లప్పిసినిజేడు.

## ౬

పటునిరాశాంధకారనిమగ్నబుద్ధి
మన మహీపతి కొక్క నూతనపురుషుఁ
దృష్టిగోచరుఁడాయె జటుక్కున; వార
వాంచె, నౌదల, వాని గుర్తించె గాన.

ఈ దురితవరము నిన్న బ్ర
సాదించిన దివ్యుఁడే ప్రసన్నుండై నే
డీ వరిసెన మిచ్చె దయన్:
శ్రీదాసమహాధవుం డిసీ; యనుచుండన్.

తేని తాఁకనను గడానియో, నెల్ల వ
స్తులును, పసిడిబొమ్మ ధగధగమనియె;
దివ్యమందహాసదీధితి గదియెల్ల;
నళదిగచ్ఛులలమి యతిశయిల్ల.

ఓ మహారాజ, దిగ్విజయోఽస్తునీకు !
సాగునే, తావకీనస్పర్శావరమ్ము,
నిర్నిరోధమ్ముగా ? ననె, నిలిచి యమరు
డట్టె, తల గదలించె, మహాధనపతి.

"పరమనిర్భాగ్యుడను," "వాస్తవమ్మె, నీవె,
పరమ నిర్భాగ్యుడవె ? యెటువలె నృపాల !
నాదు వాగ్దానవిధి, నేను, నడుప లేదె ?
నీదు వాంఛిత మఖిలమ్ము, నెగ్గలేదె ? "

కాదు కాంచనమఖిలమ్ము; కట ! కట ! కట !
మామకప్రేమసర్వస్వధామ, మిట్టె
కూలిపోయెను, నాగుండె వ్రీలిపోయె !
ననె, విషాదముద్రాంకితుడైన ఱేడు.

"నిన్నటి యహమ్మునుండియు, నిక్కము, సరి
కొత్త సంగతి యొండు కన్గొంటి వౌర !
మంటిముంతెడు చల్లని మంచినీళ్ళొ ?
కాంచనస్పృగ్వరమొ ? వరమెంచు మిపుడు."

పావనోదకమా, యెంత మంచిమాట !
కాలుకాఁనిపోవు, నాగొంతుక నెపుడేని,
నీరమేదేని, చెమరింప నేర్చునే ? య
టని, మహాతురుడై, యార్చె, నంత రాజు.

"భూరిస్పర్శయె హెచ్చో,
ఆరిన యొక రొట్టెపెచ్చొ, అవనీస్థలిలో ?"
"చేరెడు రొట్టియ కిల, బం
గారమ్మఖిలమ్ము సాటి గావచ్చు, నెదో"

"ప్రియమృదుకవోష్ణరమ్యశరీరి, తావ
కీనస్వర్ణ కుమారి యగ్రియమొ, నీకు ?
పట్టినది బంగరౌవిభవమ్ము ప్రియమొ ?
పలుకవో, భవదీయతాత్పర్య మింత."

ఓహో ! నా చిన్నారి యొప్పులకుప్ప !
నా ముద్దుల కుమారి ! నాచిట్టి కూన !

భూమిగోళమెల్ల హేమకందుకముగా,
జలుపజాలు మేటి వలతితనము !

బుచ్చితల్లి గడ్డమున, జిట్టి లొట్టియే
సంతరింపనేర, నెంత సిగ్గు !

అని, యెలుగెత్తెను పాపము
మన శ్రీదాసాభిధాన మానవపతి; నె
ట్టన, నల్పుకొనుచు జేతులు,
కనుగొనుచు మొగమ్ము, తీవ్రగతి, దివ్య డనున్ :—

హెచ్చెను నీవివేక, మది
యెంతయు, దొల్లిటికన్న; నీమనం
బచ్చముగానె, హేమమయ
మైనటు లేదదియింక; నట్టులేన్,
పచ్చము పాడెయ్యె, భవద
వస్థ యవార్య, మసాధ్య మౌను; నీ
యిచ్ఛయె, బంగరంటు త్యజి
యించుట ? నిక్కము వక్కణింపుమా !

సీ ! యసహ్యమటని, రాజు సీత్కరించె;
ఆ క్షణమున తదీయ నాసాగ్రమందు,

వ్రాలి మక్షిక, నేలపై, రాలి పడియె
కొంచనమ్మయు; జేటు కంపించి పోయె !

ఔ, మేలింక నృపాల ! పోమ్ము భవదీ
యారామసీమాంతరో
ద్దామప్రోదిని, దానమూర్తి, యొక పా
త్రం గొమ్ము తన్నీర మి
చ్ఛామార్గమ్మున జల్లు ; మంత గను నై
జ స్వస్వరూపమ్ము లే
మేమో నీచేయి యంటి యింత దనుకన్
హేమించు నవ్వస్తువుల్.

నిష్కళంకనీతినియతి, నీరీతి, సా
సేచనమ్ము, నొనరిచెదవ యేని,
నీ దురాశయైన, నీస్పృహాక్షోభామ
హాగ్ని, నిరవశేష, మారిపోవు !

అలరి; భూజాని నమ్రమూర్ధ్యుడై, మ్రొక్కి;
తలయెత్త, దివ్య యంతర్ధాన మందె.

జోళ్లు విప్పలేదు; చొక్కాయి దీయలే
దసలె, విడువలేద, యన్యవేష,
మొలసి, యొడ్డునుండి, హుమ్మని, యొక్కటే
మున్కవేసె; పూని, భూమిజాని.

తల పైకెత్తియు, పుప్పు ! పుఫ్ ! అనియె, శ్రీ
దాసార్యు డీ సుత్య నా
యలపుం దీర్చి, బలమ్ము గూర్చు; బలె ! హోయ్ !
హోయ్ ! కాంచన స్పర్శ నౌ
కలుష మ్మెల్ల, దొలంగి పోవునది; రం
గా ! శ్రీహరీ ! యింక, నీ
సలిలమ్ము న్గొనుటొండె, నాకు, దగు క
ర్జం బంచు నుత్సాహియై

ముంచె నేట కడవ; మున్పటి మరియాద;
నిండు, మంచి, మంటి కుండ యయ్యె;
ముంచె, వాని, మేటి పొంగు సందరమది;
అతని మదిని, గదిరె, నదొక మార్పు.

పరుషక్రూరకఠోర దారుణమహో
ఘోరమ్మొకం డాహ్రాదం
తరముం బాసియు, జారిపోయినటు లం
తం దోచె నంతే, నృపాం
తరమంతంతకు, తన్నరప్రకృతి జా
డన్వీడుచున్, దుర్జడ
స్థిరలోహోద్ధతి గాంచె; నీక్షణమునం
దే యందె, నైజస్థితిన్.
ఒకపూవుం దిలకించి, తీరమున నే
దో మేదురోద్వల్లి నం
దుక, హస్తాంగుళి నంటి, మంటిదార సం
తోషించె నెంతో; తదీ
య కనద్రక్తిమ చెల్వు బాయ దిది యా
హా! పచ్చనై పోదు; లే
దిక నా బంగరుటంటు నేప, మని పో
వెం దోయకుంభంబుతోన్.

ఘుందర, మందిరమునకే
తొందరజనె, నొడయుడని, నుతువనేలా, తత్
సందర్భము ? నిజనందన,
కుందనపుంబొమ్మ జల్లె గుప్పిట జలముల్.

ఆసేచనము తనపై నోకెనో లేదా
అరుణరోచుల బుగ్గలాచికొనియె,
తుంపరల్ రాల్చె పరంపరలుగ, నదే
ధోరణి, సోరెకు, తుమ్మ జొచ్చె,
ఉక్కిరిబిక్కిరై, యూపిరే యాడక,
యొగి, తుపుక్కు తుపుక్కు నుమియసాగె,
తడిసియు, నాని, ముద్దయుయి, తద్దయు నీరు
గారుట కెంతొ నిర్ఘాంతపడియె,

ఐన గానీ, జనకు డింక, నంత కంత
కెచ్చుజలముల, జల్లు నిదే మనుకొనె;
ఆమె స్వర్ణకుమారి నిజాకృతి గనె
నింతలో, నెంత, నగియుందు వీవు, పతిత ?
సాక్షివాదేని, నాటి దృశ్యమున కెల్ల.

ప్రొద్దుట దొడిగిన గౌనెటు
ముద్దయ్యెనొ, చూడు ! చాలు మొక్కెద, చల్లుల్
వద్దుపుగుము నాన్నా ! యని
ముద్దుల పాపాయి వాగమృతముం జల్లెన్.

జనకు ననునయింప, జాచిన చేతుల,
పరువు నిడ్డదాది, గురు తెఱుగదు,
అసలె యెఱుగ, దామె హారిణియై యుండిన,
యిక్కథావిధం, బి, కెటుల, వలుకు ?

తన దురంతావివేక మాత్మజకు దెలుపు
టది, యనావశ్యకమ్మని, మది దలంచె,
ప్రస్తుతాత్మవివేక ప్రభావమహిమ
అంచితమ్ము ప్రదర్శింప నెంచె తేపు.

అనుగు దనయ, దోసగొనిపోయె దోటకు;
శేష విమల సలిల సేచనమున,
సహజ వికసన ప్రసాదమూది, గులాబి
వేల నగుమొగాల మేలమాడ.

యావజ్జీవము భూవిభుండు గనె, బా
యన్ గాంచనస్పర్శ, తద్
భావోర్విన్ నటియించు సంగతులు ని
ల్వన్, రెండె; అయ్యాపగా
శ్రీవాహత్సికతాకణమ్ములవి, మిం
చెన్, గాంచనాభన్; కుమా
రీ విస్ఫారిత కాయకాంతులను, గూ
రెన్, చారుభౌర్యద్యుతుల్;
ఏవంశోభ తనూజ బొమ్మయగుము
న్నెన్నండు నెన్నండహో!

ఆ ప్రభాతమాది, యవనీధవుండు శ్రీ
దాసు డెల్లయెడల, రోసె, పసిడి;
కనకమన్న దెసకు, గన్నెని యెత్తడు,
తనయ మేని మేల్మి తళుకె గాని.

ఈ కథ చదివిన, వ్రాసిన,
సాకల్యమ్మెవరు వ్యాఖ్య సలిపిన, తృష్ణా
వ్యాకుల చిత్తవిదళన
శ్రీకాంతానుగ్రహ ప్రసిద్ధులు వారల్.